# పరిచయం



"ఆకులందున అణగి మణగి
కవిత కోయిల పలకవలెనోయ్!
పలుకులను విని దేశమం దభి
మానములు మొలకెత్తవలెనోయ్!"

ఆధునిక ఆంధ్ర సాహిత్యానికి శ్రీ వీరేశలింగం పంతులుగారు యుగపురుషులు. ఈ ప్రభాతకాలంలోనే శ్రీ గురజాడ అప్పారావుగారి రచనలు నూతన విజ్ఞానభానూదయ కాంతులు ప్రసరింపజేశాయి. వీరి రచనలు సంఖ్యలో స్వల్పమే అయినా సాటిలేనివి. కవులకు ఆదర్శమార్గాన్ని చూపించాయి. ప్రజల్లో దేశభక్తిని రేకెత్తించాయి. భాషలో, భావంలో విప్లవాన్ని సాధించాయి.

నవ్యాంధ్రసాహిత్యానికి యుగకర్త అయిన శ్రీ అప్పారావుగారు 1861 నవంబరు 30వ తేదీన విశాఖజిల్లా రాయవరం గ్రామంలో జన్మించారు. విజయనగరం కాలేజీలో చదివి 1886లో బి. ఎ. పరీక్ష ప్యాసయ్యారు. వీరు చదువుకుంటూన్న రోజుల్లోనే, ఇంగ్లీషులో కవిత్వం వ్రాసి పత్రికల్లో ప్రచురిస్తూండేవారు. పట్టభద్రులు కాకపూర్వమే 1884 లో విజయనగరం కాలేజీలో కొన్నాళ్లు ఉపాధ్యాయులుగా పనిచేశారు. కాని, అప్పుడు వారికిచ్చే జీతం నెలకు పాతిక రూపాయలుమాత్రమే. ఈ స్వల్పజీతంతో అసంతృప్తి చెంది కాబోలు, తర్వాత కొన్నాళ్ళు డిప్యూటీకలెక్టరు ఆఫీసులో హెడ్ క్లార్కుగా చేరారు. కాని, విజ్ఞానఖనియైన ఈ మహనీయునికి గుమాస్తాగిరి ఎంతకాలం సహిస్తుంది? అయిదారు మాసాల్లోనే ఆ గుమాస్తాపనికి స్వస్తి చెప్పి, కాలేజీలో మళ్ళీ లెక్చరరుగా ప్రవేశించారు. జీతంకూడా వంద రూపాయలకు పెరిగింది. ఉపాధ్యాయవృత్తిలో ఉన్నంతకాలం జీతపురాళ్ళనే తన జీవిత పరమావధిగా ఎంచుకోక, విద్యార్థుల విజ్ఞాన వికాసాలకు ప్రోత్సహించి కృషి చేస్తూండేవారు. అందువల్లనే విద్యార్థులకు వీరెంతో ప్రీతిపాత్రులు అయ్యారు.

## కన్యాశుల్కం:

ఉపాధ్యాయులుగా ఉన్న సమయంలోనే (1896) వీరు 'కన్యాశుల్కం' రచించారు. కన్యాశుల్కం రెండవకూర్పు పీఠికలో, ఆ నాటక రచనకు తానెందువల్ల ఉపక్రమించవలసివచ్చిందో, అప్పారావుగారే స్వయంగా ఇలా చెప్పారు—

"సంఘ సంస్కరణోద్యమాన్ని బలపరచడానికీ, తెలుగుభాష నాటక రంగానికి అనుకూలమైనది కాదన్న అపోహ నెదుర్కోవడానికీ, నేను కన్యాశుల్కాన్ని రాశాను."

బ్రహ్మసమాజ భావాలు ఆంధ్రదేశంలోని విద్యావంతుల్లో విరివిగా ప్రచారమవుతూన్న రోజులవి. సంఘసంస్కరణకు శ్రీ వీరేశలింగం పంతులుగారు కంకణంగట్టి పనిచేస్తున్నారు. అదే సమయంలో అప్పారావుగారు కూడా తన సాహిత్యంద్వారా సంఘ దురాచార నిర్మూలనకు పూనుకున్నారు. అయినా అప్పారావుగారు తమ రచనల్లో కళకేమాత్రం లోపం రానివ్వలేదు. ఆనాటి వ్యక్తులు తమ సహజమైన ఆచార వ్యవహారాలతో కన్యాశుల్కంలో నేటికీ మనకు కండ్లకు గట్టినట్లు సజీవంగా కనిపిస్తారు. గిరీశంలాంటి పాత్రలను ఆంధ్రదేశం ఎన్నటికీ మరిచిపోలేదు. హాస్యరస పోషణలోకూడా వీరిది అందెవేసినచెయ్యి. కన్యాశుల్కం చదివినవారుగానీ, చూచినవారుగానీ కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వకుండా ఉండలేరు. అర్థ శతాబ్దికి పూర్వమే మన తెలుగులో యింతటి చక్కనినాటకం వచ్చినందుకు ఆంధ్రజాతి నిజంగా గర్వించదగినవిషయం. ఏవో కొన్ని స్వల్పలోపాలున్నా ఈనాటికీ మన సాహిత్యంలో దీనికి దీటైన నాటకం రాలేదనే చెప్పాలి. ప్రదర్శన యోగ్యంగా వుండేందుకు అప్పారావుగారు దీన్ని ఇంకా సంక్షిప్తం చేయాలని ప్రయత్నించారు. కాని శరీరం కలిసిరాలేదు. ఇదే ఫక్కీలో ప్రారంభించబడిన 'కొండు భట్టీయం' అనే మరో నాటకంకూడా అసంపూర్తిగానే వుండిపోయింది.

## వాడుక భాష:

కన్యాశుల్క రచనానంతరం అప్పారావుగారి ఆరోగ్యం చెడిపోయినందువల్ల వారికి విశ్రాంతి నిచ్చేందుకు విజయనగరం ఆనందగజపతి మహారాజుగారు అప్పారావుగారిని 1896 జూన్‌లో లెక్చరరు పదవినుండి మాన్పించి సంస్థాన శాసన పరిశోధకునిగా నియమించారు.

ఆ సమయంలో అప్పారావుగారు అనేక చారిత్రక విషయాలను పరిశోధించారు. కళింగదేశచరిత్రను రాయడానికికూడా పూనుకున్నారు. కాని ప్రచురణకర్తలైన విజ్ఞానచంద్రికా గ్రంథమండలివారు గ్రాంథికభాషలోనే ఆ గ్రంథం ఉండాలని పట్టుబట్టారు. కాని అందుకు అప్పారావుగారు అంగీకరించలేదు. "నాది ప్రజల వుద్యమం. దానిని ఎవరిని సంతోషపెట్టడానికీ వదులుకోలేను" అని ఖచ్చితంగా సమాధానమిచ్చారు. అర్థశతాబ్ది గడచిన తరవాత నేటికీ ఆంధ్ర విశ్వవిద్యాలయం చేయలేని పనిని ఆనాడే అప్పారావుగారు చేసిచూపారు. వాడుకభాష ప్రచారానికి శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు చేసిన అమూల్యసేవను ఆంధ్రజాతి ఎన్నటికీ మరచిపోలేదు. పండిత ప్రకాండులతో ఢీకొని 'గిడుగు' పిడుగులాగా గర్జించి వ్యావహారిక భాషా ప్రచారావశ్యకతను, దాని ప్రాశస్త్యాన్ని రుజువుచేస్తూవున్న సమయంలో అప్పారావుగారు వాడుకభాషలో చక్కని రచనలు సాగించి వారి మార్గాన్ని సుగమతరం చేశారు. ప్రజాసామాన్యంతో సాహిత్యానికి సన్నిహిత సంబంధం ఏర్పరిచారు.

## ఉత్తమ కళావేత్త:

"కొత్తపాతల మేలుకలయిక"తోపాటు, అప్పారావుగారి రచనల్లో కమ్మని తెలుగుదనం ప్రతి శబ్దంలోనూ ఉట్టిపడుతుంది. కొద్ది మాటల్లోనే భావాన్ని సూటిగా గుండెకు తగిలేట్టు చెప్పుతారు. 'పూర్ణమ్మ', 'కన్యక' లాంటి గేయాలు యిందుకు చక్కని వుదాహరణలు. ఇవి చదువుతూవుంటే పాఠకుని హృదయం జలదరిస్తుంది. కన్నీరు బొటబొట కారుతుంది. 'కాసులు' అనే ఖండకావ్యంలో

"మగలు ప్రేమని మది దలంచకు
మగలు మరలును వయసుతోడనె
మాయమర్మము లేని నేస్తము
మగువలకు మగవారి కొక్కటె
బ్రతుకు సుకముకు రాజమార్గము
ప్రేమనిచ్చిన ప్రేమవచ్చును
ప్రేమనిలిపిన ప్రేమనిలుచును".

అని చెప్పి ఆదర్శప్రేమ అంటే ఏమిటో చక్కగా నిర్వచించారు.

సంఘ సంస్కరణప్రియుడైన భర్తను ఒక సామాన్యకుటుంబములోని స్త్రీ ఏవిధంగా భావిస్తుందో 'ముత్యాలసరములు'లో సహజంగా చిత్రించారు. అమాయికురాలైన ఈకొమ్మమాటలకు పాఠకునికి కోపం రాకపోగా వర్ణాశ్రమ ధర్మశృంఖలాలు ఈమెను యెంతగా బంధించివేశాయో చూచి జాలివేస్తుంది.

'లవణరాజు కల' జ్ఞానవాసిష్ఠంలోనిది అయినా - మహాకవి దానికి ఒక అపూర్వశోభను చేకూర్చారు. అవాస్తవిక విషయమైనా, దీన్ని చదువుతూ ఉన్నంతసేపు పాఠకుడు వాస్తవిక జగత్తులోనే విహరిస్తున్నాననుకుంటాడు.

గ్రీక్ కథను కథావస్తువుగా తీసుకొని రచింపబడిన 'డామన్ పితియస్' అను పద్య కథానికలో ఆదర్శమైత్రి అంటే ఏమిటో నిరూపించారు.

'లంగరెత్తుము', 'దించు లంగరు' అనేవి రెండూ, ప్రథమ ప్రపంచ యుద్ధజ్వాలలు ప్రపంచాన్ని ఆవహించుకుంటూన్న కాలంలో వ్రాయబడినవి.

## ముత్యాలసరం:

ప్రతిభానిధియైన ఈ మహాకవి ఆంధ్రభాషకు 'ముత్యాలసరం' అనే చక్కని ఛందస్సును ప్రసాదించారు. వసుచరిత్రాది ప్రబంధాల్లో వాడబడిన

"బాల బాలరసాల మిది పిక
పాలి పాలిటి యమరసాలము
గేలి గేలిడి గ్రుచ్చు గడు రా
గిల్లు గిల్లుము తత్ప్రవాలము"

ఈ వృషభగతి రగడలోని నాలుగవ పంక్తిలో కొన్ని మాత్రలు తగ్గించినచో ఈ ఛందస్సు ఏర్పడుతుంది. "గుమ్మడేడే గోపిదేవి" లాంటి పాటలు ఇంతకు పూర్వమే ఉన్నా, దీనిని ప్రచారంలోకి తెచ్చింది శ్రీ గురజాడవారే. ప్రజల వాడుకభాషలో వ్రాయబడి, మృదుమధురమైన పదాల పొందికతో, ఇంపుసొంపులు గులుకు గురజాడవారి 'ముత్యాల సరాలు' మన ఆంధ్రభాషావధూటికి నిజంగా ముత్యాల సరాలే!

## దేశభక్తి:

అప్పారావుగారిలో మొదటినుంచీ బ్రహ్మసమాజ భావాలతోపాటు జాతీయభావాలుకూడా ప్రబలంగా ఉండేవి. 1887 లోనే కాంగ్రెసు మీటింగులకు వెళ్ళి, ఉపన్యాసా లిస్తూండేవారు. అప్పారావుగారి ప్రతి రచనలోను సంఘసంస్కరణ ప్రియత్వం స్పష్టంగా ద్యోతక మవుతుంది.

"మలినదేహుల మాల లనుచును
మలినచిత్తుల కధిక కులముల
నెలవొసంగిన వర్ణ ధర్మ
మధర్మ ధర్మంబే"

అని చాటారు. మతంపేరిట జరుగుతున్న మోసాలను ఎత్తిచూపారు. సంఘాభివృద్ధికి వేరుపురుగుగా పరిణమించిన ప్రతి మూఢవిశ్వాసాన్ని ఖండించారు. తోకచుక్క రావడంవల్ల ఏదో పెద్ద ముప్పు కలుగుతుందని బెదిరి పోయేవారికి, ఎలాంటి సమాధాన మిచ్చారో చూడండి!

"తెగులు కిరవని కతల పన్నుచు
దిగులుచెందు టిదేటి కార్యము
తలతు నేనిది సంఘ సంస్కార
ణ ప్రయాణ పతాకగాన్"

"వీటి అన్నిటికీ మించినది అప్పారావుగారి 'దేశభక్తి' అనే గేయం. ఇందులోని ఒక్కొక్క పాదం నిజంగా ఒక్కొక్క ముత్యం లాంటిది. ఈ గేయం ఒక్కటి చాలు; అప్పారావుగారిని అమరజీవిని చేయడానికి. భారత దేశంలో అనేక జాతీయగీతాలు వచ్చాయి కాని, వాటిలో దేనికీ అప్పారావుగారి గీతంలోని భావగాంభీర్యం లేదు. బంకించంద్రుని 'వందేమాతరం' గానీ, రవీంద్రుని 'జనగణమన' గానీ, ఇక్బాల్ రచించిన 'హిందూస్తాన్ హమారా' గానీ, 'దేశమును ప్రేమించుమన్నా' గీతానికి ఏమాత్రం పోలికకు రాలేవు."

ఈ గీతాన్ని అప్పారావుగారు 1910 లో రచించారు. ఈనాడు మన విశాలాంధ్రంలోని పల్లెపల్లెలో ఈ గీతం మారుమోగుతుంది. యువకుల్లో దేశభక్తిని రేకెత్తిస్తూంది.

"దేశాభిమానం నాకు కద్దని
వొట్టిగొప్పలు చెప్పుకోకోయ్
పూని యేదైనాను ఒక మేల్
కూర్చిజనులకు చూపవోయ్"

అని జాతీయవాదులను హెచ్చరిస్తూంది.

"స్వంతలాభం కొంతమానుకు
పొరుగువాడికి తోడుపడవోయ్
దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్"

అని కర్తవ్యాన్ని ప్రబోధిస్తూంది.

మతంపేరుతో గొంతులు కోసుకోవద్దనీ,

"అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయ్"

అని హిందూముస్లిం సోదరులకు పదేపదే చెప్పుతూవుంది.

"మందగించక ముందు అడుగేయ్
వెనకబడితే వెనకేనోయ్"

అంటూ ఎప్పటికప్పుడు నూతనోత్సాహాన్ని యిచ్చి ముక్కోటి ఆంధ్రులను ముందుకు నడిపిస్తూవుంది.

ఈ విధంగా ఆంధ్రజాతి కంతటికీ 'మేలుకొలుపు' పాడిన ఈ అభ్యుదయ మహాకవి 1915 నవంబరు 30 వ తేదీన 54 సంవత్సరాల వయస్సులోనే యీ జీవితయాత్ర ముగించారు. లేనిచో మన ఆంధ్రసాహిత్యం యింకెంత ఔన్నత్యదశలో వుండేదో !

—వాసిరెడ్డి భాస్కరరావు



# ముత్యాలసరములు

గుత్తునా ముత్యాలసరములు
కూర్చుకొని తేటైనమాటల,
కొత్తపాతల మేలు కలయిక
క్రొమ్మెఱుంగులు జిమ్మగా.

మెచ్చనంటావీవు; నీ విక
మెచ్చకుంటే మించిపాయెను;
కొయ్యబొమ్మలె మెచ్చుకళ్ళకు
కోమలులసౌరెక్కునా ?

తూర్పు బలబల తెల్లవారెను,
తోకచుక్కయు వేగుచుక్కయు,
ఒడయుడౌ వేవెల్గు కొలువుకు
వెడలి మెరసిరి మిన్నువీధిని.

వెలుగునీటను గ్రుంకె చుక్కలు;
చదలచీకటి కదలబారెను;
యెక్కడనో వొక చెట్టుమాటున
నొక్క కోకిల పలుకసాగెను.

మేలుకొలుపులు కోడికూసెను,
విరులు కన్నులు విచ్చిచూసెను;
ఉండి, ఉడిగియు, ఆకులాడగ,
కొసరెనోయన గాలివీచెను.

పట్నమున పదినాళులుంటిని
కార్యవశమున పోయి; యచ్చట

సంఘసంస్కరణ ప్రవీణుల
సంగతుల మెలగి,

యిల్లుజేరితి నాటి వేకువ;
జేరి, ప్రేయసి నిదుర లేపితి;
"కంటివే" నేనంటి, "మింటను
కాము బాణం బమరియున్నది."

తెలిసి, దిగ్గున లేచి, ప్రేయసి
నన్నుగానక, మిన్నుగానక,
కురులు, సరులును కుదురుజేయుచు
ఓరమోమిడ, బల్కితిన్.

"ధూమకేతువు కేతువనిరో
మోముచందురు డలిగిచూడడు?
కేతువా యది? వేల్పు లలనల
కేలి వెలిగొగ కాంచుమా!

అరుదుగా మిను చప్పరంబున
చొప్పు తెలియని వింత పొడమగ
చన్నకాలపు చిన్నబుద్ధులు
బెదిరి యెంచిరి కీడుగా.

అంతెకాని రవంతయైనను
వంత నేగతి కూర్చనేర్చునె,
నలువ నేరిమి కంతుయిదియన
నింగితోడవయి ప్రేలుచున్.

కవులకల్పన కలిమి నెన్నో
వన్నెచిన్నెలు గాంచు వస్తువు
లందు వెట్టి పురాణగాథలు
నమ్మజెల్లును పండితుల్.

కన్నుకానని వస్తుతత్త్వము
కాంచనేర్పరు లింగిరీజులు;
కల్లనొల్లరు; వారి విద్యల
కరచి సత్యము నరసితిన్.

దూరబంధువు యితడు భూమికి,
దారిబోవుచు చూడవచ్చెను
డెబ్బదేనుబది యేండ్ల కొక తరి
నరుల కన్నుల పండువై.

తెగులు కిరవని కతల నన్నుచు
దిగులుజెందు టదేటికార్యము?
తలతు నేనిది సంఘ సంస్కర
ణ ప్రయాణ పతాకగాన్.

చూడు మునుమును మేటివారల
మాట లనియెడి మంత్రమహిమను
జాతిబంధము లన్న గొలుసులు
జారి, సంపద లుబ్బెడున్.

ఎల్లలోకము వొక్కయిల్లై,
వర్ణ భేదము లెల్లకల్లై,

వేల నెఱగని ప్రేమబంధము
వేడుకలు కురియ.

మతము లన్నియు మాసిపోవును,
జ్ఞాన మొక్కటి నిలిచి వెలుగును;
అంత స్వర్గ సుఖంబు లన్నవి
యవని విలసిల్లున్.

మొన్న పట్నమునందు ప్రాజ్ఞులు
మొట్టమొదటిది మెట్టయిదియని,
పెట్టినా రొక విందు, జాతుల
జేర్చి; వినవై తో ”

అంటి నే నిట్లంత ప్రియసఖి
యేమి పలుకకయుండి యొకతరి
పిదప కన్నుల నీరుకారుచు
పలికె నీరీతిన్.

“ వింటి మీమాటలెల్ల వింటిని,
కంట నిద్దుర కానకుంటిని;
యీ చిన్న మనసును చిన్నబుచ్చుట
యెన్నికని యోచించిరో ?

తోటికోడలు దెప్పె, పోనీ;
సాటివా రోదార్చె, పోనీ;
మాటలాడక చూచిన వ్వెడి
మగువ కేమందున్.

తోడుదొంగని అత్తగారికి
తోచెనేమోయనుచు గుందితి;
కాలగతియని మామలెంతో
కలగ సిగ్గరినై.

చాలునహా! మీచాకచక్యము
చదువు కిదె కాబోలు ఫలితము!
ఇంతయగునని పెద్దలెరిగిన
యింగిలీషులు చెప్పదురా?

కోటపేటలు నేలగలరని
కోటివిద్యలు మీకు గరపిరి;
పొట్టకూటికి నేర్చువిద్యలు
పుట్టకిట్లు కదల్చెనా?

కట్టుకున్నది యేమికానీ;
పెట్టిపొయ్యక పోతేపోనీ;
కాంచిపెంచిన తల్లిదండ్రుల
నైన కనవలదో?

కలసి మెసగిన యంత్రమాత్రనె
కలుగ బోదీ యైకమత్యము;
మాలమాదిగ కన్నె నెవతెనొ
మరులుకొనరాదో?"

అనుచు కోపము నాపజాలక
జీవితేశ్వరి సరుల నాసై

చెరచి చనె క్రొమ్మెరుగు చాడ్పున
మనసు వికలముగాన్.

తూర్పు బల్లున తెల్లవారెను;
తోకచుక్క యదృశ్యమాయెను;
లోకమందలి మంచిచెడ్డలు
లోకు లెరుగుదురా!



# కాసులు

మనల కీ పోరాట మిప్పుడు
దేనిగూరిచి కలిగె చెప్పుమా,
మరచితిని;...నవ్వెద వదేలను ?
యేమికారణ మైన పోనీ;

వినుము...ధనములు రెండు తెగలు;
ఒకటి మట్టిని పుట్టినది; వే
రొకటి హృత్కమలంపు సౌరభ
మ, నియు నిది యొక్కడను కలుగుట
యరుదు, సతులకు వేడతగినది
యెద్దియో ?

"మనసులో నీకుండు
ధన మన నొండు కలదే పసిడి
గాక"ని. ప్రాజ్ఞులకె కనికట్టు
చెరుచుట చిత్రమా ! తీవలకు

తలిరుల తెరంగున, కాంచనము
సింగారమందురు లలనలకు;
కానిమ్ము; గాని, కమ్మనితావి
గ్రమ్మెడి పువ్వునిచయము ప్రేమ
కా ? అదిలేక మంకెన కెంపు,
కాంతల యందము.

"ప్రేమ కొరుకుకు
తిందురా? యెట్టిదది? నావలను
కలదో, లేదో;" యను నొక వింత
చూపును చూచెదవు.

బంగరు

మిసిమి మేనికి పసపు నలదితి;
కురుల నలరుల నూనె నించితి;
కాటుకను మెరుగిడితి చూడ్కికి;
విడెము వింతహారంగు గూర్చెను
వా తెరకు; పలువరుస వెన్నెల

లలమె; దాన దానను, మురుపు
పెనగొనె. నేర్చి మెరసితిరూపు;
ప్రేమ పెంచక పెరుగునే?!

ప్రేమ

పెన్నిధిగాని, యింటను నేర్ప
రీకళ, ఒజ్జలెవ్వరు లేరు.

శాస్త్రము లిందుగూరిచి తాల్చె
మౌనము–నేను నేర్చితి భాగ్య
వశమున, కవులకృపగని, హృదయ
మెల్లను నించినాడను ప్రేమ
యను రతనాల–కొమ్మ!
తొడవులుగ నవి మేన దాల్చుట

యెటులనంటివో? తాల్చితదె, నా
కంటచూడుము! సతులసోరను
కమలవనముకు పతుల ప్రేమయె
వెన్నెలుగు; ప్రేమకలుగక బ్రతుకు
చీకటి.

నా నేర్పు కొలదిది
(ప్రేమ విద్దెకు వోనమాలివి.)
యెదను నిల్పిన, మేలుచేకురు
"మకులు ప్రేమని మదిదలంచకు;
మకులు మరలును వయసుతోడనె;
మాయ, మర్మములేని నేస్తము
మగువలకు మగవారి కొక్కటే,
బ్రతుకు సుకముకు రాజమార్గము-
ప్రేమ నిచ్చిన ప్రేమ వచ్చును-
ప్రేమ నిలిపిన, ప్రేమ నిలుచును"
ఇంతియె.
కాసు వీసము నివ్వనొల్లక;
కవిత పన్నితినని తలంపకు;
కాసు లివె; నీ కంఠసీమను
జేరి బంగరు వన్నెగాంచుత!
మగడు వేల్పన పాతమాటది;
ప్రాణమిత్రుడ నీకు నీ సెనరు
కలుగక యున్న, పేదను; కలిగినను
నా పదవి వేల్పులకేని కెక్కడ?

# లవణరాజు కల

నిండు కొలువున లవణుడను రా
జుండె, జాలిక డొకడు దరి జని,
“దండి నృప! యొక గండుగారడి
        కలదు కను” మనియెన్.

అల్ల పింఛము నెత్తినంతనె
వెల్లగుఱ్ఱం బొకటి యంచల
పల్లటీల్పస నొడయు నొల్లము,
        కొల్లకొని వచ్చెన్;

వచ్చి నిలిచిన వారువంబును
యచ్చెరువు పైకొన్న చూపున
మచ్చమేరలు గనక చూసెడి
        నృపుని కత డనియెన్;

“ఉత్తమాశ్వం బిది నరేశ్వర!
చిత్రగతులను సత్వజవముల
చిత్త మలరించెని జను డిక
        మనసుగల చోట్లన్.”

చూపు దక్కగ చేష్ట లుడిగెను
చూపరులు వెరగంద నృపునకు;
రేపు చెడి, యొక కొంత తడవున
కెరిగి, నలుగడలన్ ·

కలయఁజూసెను, కల్లనిజములు
కలఁకజెందిన మనసులోపల
మెల్లమెల్లన పూర్వజ్ఞానం
బల్లుకొని పొడమ !

" యేడి జాలకు డేవి యశ్వం
బేఁడు లెన్నో గడచె " నని నృపు
" డేఁడు నిమిషము లేవి ప్రభువా !"
యనిరి తన భృత్యుల్.

కలదు లేదను రెండు భ్రాంతుల
కలయఁగూర్చకు బుద్ధిబలమున
కాలమహిమకు నెరగుజెందుచు
బసఁగా జిల్లనియెన్.

" వడు నిమిషము లేఁడులాయెనో ?
యేఁడునిమిషములంగ యినిడెనో
యేఁడులెన్నో ! యింత లంతలు
చింత చేయునొకో !"

యెక్కొనట వొక మాయగుట్టం
బొక్క నరపతి మనసు నిలవక;
యెక్కెనంతన పరవశంబై
యెగసె నది యటకో !

కన్న విన్నను గనని జవమున
కానసంబులు గడిచి యెన్నో,

యెన్న జీవం బొక్కఁటేనియు
లేని మరుభూమిన్

మట్టిచనె, సంసృతిని జీవం
బట్టు; యిరులును మరులు వేళకు
తుట్టతుద కొక గున్నయడవిని
బట్టి గమనంబున్

మందగించిన, మానవేంద్రుం
డందుకొనె నొక కొమ్మ నల్లుకు
క్రిందు వ్రేలెడి తీవ; గుజ్జము
ముందువలె పరచెన్

అడుగు పుడమిని తగిలినంతనె,
బడలియుంటను నిదురపాలై
ఒడలు తెలియక వ్రాలి నరపతి
చాగె మృతునట్లన్

పిదప జన్మాంతరము తెరగున
నిదుర జారినవేళ, కన్నుల
యెదుట వెలసెను వింతలోకము
సంజ కెంజాయన్

వెలుగు నీడలు కనుల కింపై
మెలగి చెలగెడి నాకసంబున
వ్రేలు మబ్బుల యంచులంటను
రగిలె రత్నరుచుల్

పారె పక్షులు పౌఁజు పౌఁజుల;
జీరె కోయిల లొకటి వొకసి;
దూరి గూడుల బాసలాడెను
    పిట్ట లెల్లెడలన్

గగన రాజ్యము గ్రమ్ము వేడుక
మగటిమిని తన కళలు గూర్చుచు,
పగలు వెన్నునదన్ని సోముడు
    పైనమై వెడలెన్

తాటివనములు తూర్పుకొండను
గొడుగు లెత్తెను; చామరంబులు
నిడిపె, జీలుగు లుడు గణంబులు
    దవ్వులను నిలిచెన్

చల్లగాలులు సాగి యలలుగ
జల్లుజల్లున రాల్చె పూవుల;
ఉల్ల మలరెను; ఆక లొక్కటె
    బడబవలె నడరెన్

అంత చెవులకు దవ్వుదవ్వుల
వింతగానం బొకటి సోకెను
సోకినంతనె పూర్వవాసన
    పిలిచినట్లాయెన్

మరచె నాకలి; మరలె నిదుములు;
పరవశుండై నృపతి, గానము

దరియు, గాంచెను శ్యామలాంగిని
నొక్క జవ్వనిసిన్
అరమొగిడ్చిన కన్ను గవతో,
చెదరియాడెడి ముంగురులతో,
బెదురుయెరగని బింక మొప్పిన
బెడగు నడకలతో;
కూటి కడవను బుజముపై నిడు
వాట మదియొక ముకువుగులకగ
పాట పాడెను, పాటలాధరి
చెట్లు చామలకై.
పాట పాడెను, చెట్లు చామలు
కోటి చెవులను గ్రోలి యలరగ;
తాటివనమున నాగి చంద్రుడు
తాను చెవియొగ్గెన్.
ఎవనిగూరిచి పాటపాడెనో ?
యెవని నామము ధన్యమాయెనో ?
లవణుడను మా టొకటి నా చెవి
తాకినట్లయ్యెన్.

ii

మంచివలె నిది మాయమగునని
యెంచి, యించుక సంశయించక
కించలన్నియు తొలగి వెంబడి
వేడి యిట్లంటిన్.

"వినుము, కిన్నరి! నీకు దైవం
బన్ని శుభములు గూర్చుఁగావుత!
నిన్న నుండియు నన్నెఱుగని
యాశ లోఁకవంకన్.

అంతకన్నను అధికతర మొక
వింతయాఁకలి మనసు గ్రాఁచెను;
యింత అంతని చెప్పనేరక
యిట్లు వెంబడితిన్."

అనగ కన్నియ తిరిగి మెల్లన
నన్ను కన్నులు విచ్చి చూఁసెను;
పూర్ణ బ్రహ్మాండాధి రాజ్యము
పూనినట్లయ్యెన్.

చూఁసె, కన్నులుడించి, మది తల
పోఁసి, మిన్నక తోఁవసాఁగెను;
బాఁసె బింకము బెడగు నడకల,
ముగిసె గాఁనంబున్.

పండు వెన్నెల కుముద వనిపై
నిండు గమ్మన నీడకై వడి
నిండె మోఁమున చింత యొక్కటి
మరల నే నంటిన్.

" అన్నమిను టాఁకొన్నవారల
కన్న సుకృతతమం బటంచును

మున్ను పెద్దలు బల్కరది నీ
వెఱుగకుండుదువే ?

భృత్యునైతిని నీదు మూర్తికి;
భృత్యునౌదును నీకు సుందరి !
మృత్యుముఖముననున్న భటునకు
నన్న మీవలదో ?

చన్న బ్రతుకుల కొలిచి కుడిచిన
తెన్ను మనసుకు కొంత త్రోచెడి;
నిన్న యన్నదె, నేడు రేపులు
అన్యు నెట్లగుదున్ ?

మానమూనిన, మరలగలనని
మది దలంపకు” మంటి; కన్నియ,
గమన మించుక మందగించి
శిరంబు వంచి యనెన్.

వన్నె మీరిన మేని పసఁతో
కన్ను మణగెడి రత్నరుచితో
“ నన్ను తెలియక నాసచేసెద
వయ్యొ ! మాలిత నేన్,

అయ్యకోసము కూఁడు, కొందును !
ఇయ్యలేనను మాట, హృదయము
వ్రయ్యచేసెదు; నాదు భాగ్యము
కెవరి నే మందున్.”

iii

అన్నపలుకు విసంప్రుభల్లము
కన్నవాఁడయి మనసు దూసెను;
కన్నె కన్నుల నీరు గమ్మట
కాంచి ఖిన్నుఁడనై,

కొన్ని నిమిషము లెన్నియెన్నో
కన్న విన్నవి ధర్మములనే
యెన్నుకొని, యొక పరమధర్మము
నపుడు గనుగొంటిన్ !

మలినవృత్తులు మాలవా రని
కులము వేర్చిన బలియురొక దే
శమున కొందరి వెలికిదోసిరి
మలినమే, మాల—
కులము లేదట యొక్క-వేటున
పసరముల హింసించువారికి
కులము కలదట నరుల వ్రేచెడి
క్రూరకర్మలకున్ !
మలిన దేహుల మాల లనుచును
మలిన చిత్తుల కధిక కులముల
నెలవొసంగిన వర్ణధర్మ మ
ధర్మ ధర్మంబే !
అనెడు నిశ్చయ మాత్మ దోపగ
"వినుము కన్నియ !" యంటి యెమ్మరై

"జనులు తెలియక పలుకుమాటకు
జనదు వగవంగన్.

మంచిచెడ్డలు మనుజులందున,
యెంచి చూడగ, రెండె కులములు
మంచి యన్నది, మాల యైతే,
మాలనే, అగుదున్ !

తెలివి యెలికెడి తేట కన్నులు
మురుపు గులికెడి ముద్దుమోమును
వేల్పు చేడియలైన నేరని
గాన మాధురియున్,

చిత్తరువులందైన గనని ప
విత్రరూపపు సౌష్టవంబును,
ఉత్తమోత్తమ జాతిలక్షణ
యుక్తి సంపదయున్.

మాలయనువారున్న, వారల
మందబుద్ధికి వగవవలె; తన
యందు లేని కొరంత కలదని
వగవగానేలా;

నమ్ము నేననుమాట, తెరవ ! భ
యమ్ము వాయుము; కూటెనిడిచే
కొమ్ము నా హృదయంపు రాజ్యము
నిస్సపత్న్యముగాన్."

వినియె వ్రీడా విస్మయంబులు
ఆననంబున పొడమి పొరగ
కనుల నెత్తుచు, డించుచును నను
కాంత యిటు బలికెన్.

"తండ్రికోసము తెచ్చు కూటిని
తిండికై యెరు కెట్టు లిత్తును?
పెండ్లియాడిన పెనిమి టొకనికి
పెట్ట ధర్మంబా!

తడవు ఆయెను; తల్లడిల్లుచు
తండ్రి నాకై యెదురుచూచును"
అనుచు నన్ను తొలంగు భావము
అతివ అగుపరచన్,

కరంబుబట్టి యురంబు యురమున
జేర్చి, ముద్దిడి, కురులు దువ్వితి
తాళవనమును వెడలి చంద్రుడు
పక్కనను నవ్వెన్!

"ఆడబోయిన తీర్థమెదురై
వేడబోయిన వరము వచ్చెను;
పెండ్లియాడెద చంద్రు సాక్షిగ
పెట్టు కూ"డంటిన్.

మున్ను వేల్పులు వెన్న చేతను
గొన్న యమృతముకన్న రుచులను

చెన్ను మీారెను కూడు, కన్నియ
చేతనిడినంతన్.

iv

"వచ్చితివ యల్లుండ !" నీకై
వేచియుంటిని యింతకాలము;
యిచ్చితిని, చేకొమ్ము కూతును
ప్రాణ మది నాకున్ !

వచ్చితిమి మొటనుండొ, అట
నిచ్చ మెంసై యుండు మనమున;
పసిడిగొలుసులు, బిడ్డ నాకై
పట్టి నన్నుంచెన్.

ఇహము లోపలి మంచియెంతయు
యిమిడియున్నది దీని ఆత్మను;
ముక్తి కాంతై తుదకు నీ కిది
ముందుగతి చూపున్.

కరపినాడను పరము మరవక
యిహామునందున మనెడు మర్మము;
కోటితపముల పుణ్యఫల మిది
కొమ్ము నీ కిస్తిన్ !

మాల్లనైనను మలినవృత్తులు
మానుకుంటిని గురువుదయచే;
పొలములోపల పశులమేపుచు
పొట్టపోషింతున్.

మలినవృత్తులు మాన్పి, మాలల
వలస తెచ్చితి యీ వనాంతము;
పల్లె కలదిట; ప్రాజ్ఞు లందలి
ప్రజలు మావారల్.

పాడిపంటలు గలవు; తామర
తంపరలు మా పశులమందలు;
జంతుహింసను చేయనొల్లము
భూతదయ మతము.

కాని మనుజుని బుద్ధిలోపల
కలవు, తన నే లోరుల కీడును
తలచు వృత్తులు; కానబోయిన
కలచు నెవ్వారిన్.

మాన్పగలిగితి కత్తికోతలు;
మాన్పవశమే, మాటకోతలు
కత్తిచంపును; మాటవాతలు
మాన వేనాడున్!

నాటునను గలయట్టి యిడుములు
కాటియందును కలవు; ఓరిమి
యేటికైనను మందు, కలిగిన
కలుగు సౌఖ్యంబుల్.

యేలుకొను డొండొరుల; సిరులకు
మిట్టిపడకుడు; కీడుమూడిన

నాడు కుంగకు, డొరల మేలుకు
పాటుపడు డెపుడున్"

అనుచు పలికెను వేదవాక్కులు
మమ్ము చేతులబట్టి కన్నియ
తండ్రి, తొల్లిటి ఋషి యితం డని
తోచ చిత్తమునన్.

పండు గెడ్డము, నిండుకన్నుల
నిండ శాంతిరసంబు, పలుకుల
కడలి గాంభీర్యంబు, యొడలిని
దివ్య తేజంబున్.

కలిగి కూచునె రాజఋషివలె
రావికిందను రచ్చశిలపై
కొమ్మలను జొరి చంద్రకాంతులు
మేన చెదరంగన్.

అంతనుండియు కొన్నిపంటలు
కాంతతో నట స్వర్గసౌఖ్యము
లొంది మంటిని; చక్రవర్తుల
కొమరులను కంటిన్.

చిత్త మా కొమరులను తగులుట
క్రొత్త శృంఖల యంచు మామ ని
వృత్తిమార్గముపట్టి, దేహము
వాసె యోగమునన్.

పల్లెలోపల దొమ్ములాటలు
అల్లుకొనె, ఆ నాటనుండియు
యెల్లవారలు పెద్దలగుటకు
యెంచిచూడంగన్.

సన్నగిల్లెను సాగు పొలమున;
వున్నదెల్లను తిన్నపిమ్మట
తినిరి పెంచినపశుల చంపుక;
అవియు కడితేరన్

చెల్లచెదురై పరచి రందరు
యెల్లదిశలను; పరచు ముందర
కొల్లకొని రేనున్న పొలమును
పండి మే ముండన్.

తెల్లవారిననుండి మేమును
పిల్లలము పడ్డట్టి పాటులు
ఝల్లుమనియెడు నొడలు, తలచిన
చాల, చెప్పంగన్.

అడవియందలి కాయకసురులు
కుడువనేరక బడలె బిడ్డలు;
అడవి దిమ్మరి కడకు ప్రాణము
చేరి నే నుంటిన్.

ప్రాణసఖి నను పిలచి యప్పుడు
పలికె స్మితముఖియై "వినుం డిక

చేయుకార్యము లేదు; చెల్లెను
ముందు గనవలయున్.

కడకు జేరితి మీ భవనంబున;
తడవు లేదిక; మనసు తిప్పుకు
గడగవలె రాబోవు భవమున
జ్ఞానసంపదకై.

కష్టసుఖముల తీరు లెన్నన
దృష్టములు—మన సత్యవర్తన
కాచుగావుత, కావగలిగిన
కన్న పసివాండ్రన్.

చింత యుడుగుడు—చితిని జొత్తము
యింతకన్నను భాగ్య మున్నదె!
అంతమున మతి యెట్లుండునో
అట్టిగతి గల్గున్.

కలుగు భవములుకూడ నీతో
కలసి గడపుచు ముక్తి జెందెద-
కలదె నీ ప్రణయామృతి సేకము
కన్న సద్గతియున్?"

అనుచు, చింతలువాసి, కైకై
జేరి జొచ్చితి మపుడు చితి.

V

పలికె నిట్టుల పటువిషాద స
మాకులేక్షణుడగుచు లవణుడు;
"కలగ వలదిది మాయసర్వం"
బనిరి శాస్త్రజ్ఞుల్.

లవణు డనియెను, బొమలు ముడివడ,
"కలగవలదట! కల్ల యిదియట!
కలిగినది లేదన్న యంతనె
తొలుగునట వేధల్!

పుస్తకంబులలోని మాటలు
విస్తరించుచు, ననుభవమ్ముల
తత్త్వమెఱుగక, శుకము లగుదురు
వొట్టిశాస్త్రజ్ఞుల్!

యెప్పటికి అనుభూతమొద్దియొ
అప్పటికి యది నిక్కువంబే;
యెప్పుడో లోకంబు కల్లగు
ననుట యిపుడెట్లో?

చిత్తమందున కీలితములై
నిత్యఖేదము నిచ్చు తలపుల
నెత్తినైచును? – లేరె, హా! యిది
చెప్పగల ప్రాజ్ఞుల్?

యెక్కడిది, ఆ మాయదేశం
బెక్కడుందురు నాదుబిడ్డలు?

ఒక్కరైనను జూపలేరే
నాదు ప్రాణసఖిన్ ? ”

నృపుడు యిట్లని శోకభార
మ్మాపుకొన శక్యమ్ముగా కిరు
కేల కన్నులుమూసి, చింతా
మగ్నుడై యుండెన్.

అంత దుర్గద్వారసీమను
వింత కలకల వినగనయ్యెను;
చెంత ద్వారకు డేగి నృపునకు
తెల్పె “ నొక మునియున్

వారువముపై నొక్కకన్నియ
వచ్చి నిలిచిరి ద్వారసీమను ”,
“ తెచ్చెరను తెమ్మని ”యె నరపతి
నోటమాటుండఁన్.

జొచ్చె నాస్థానాంగణ బవు
డప్సరాకృతి నొక్క కన్నియ;
అచ్చవర్ణపు టశ్వరాజం
బొక్క తాపసుడున్.

పలికె తాపసు “ డతుల సౌఖ్యం
బధిప ! నీకౌగాక ! యువనుడు,
సింధు దేశాధిపుడు, పితృ సఖు
డంపె కానుకగా.

తనదు గాదిలివట్టి, యీయమ
వినయ విద్యా సద్గుణాన్విత
కోరె నీ నెయ్యంబు; నీ గుణ
సంపదకు నలరెన్.

పంపె నీకీ యశ్వరాజం
బెందులే దిద్దాని కీడౌన
చెవిని మాటలు సోకి సోకక
లవణు డక్కున్నం

చూచి, స్మయ హర్షాతిరేకము,
లాత్మ పెనగొన, డాసి, చేకొని
'వచ్చితివ నా ప్రాణసఖి !' యని
గద్దియను జేర్చెన్.



# కన్యక

తగటు బంగరు చీరె కట్టి
కురుల పువ్వుల సరులు జుట్టి
నుదుట కుంకుమబొట్టు పెట్టి
సొంపు పెంపారన్;

తొగల కాంతులు కనులు పరపగ
మించు తళుకులు నగలు నెరపగ
నడక లంచకు నడలు కరపగ
కన్నె వరతెంచెన్
రాజవీధిని.

పసిడి కడవల పాలు పెరుగులు
పళ్ళెరమ్ముల పళ్లు పువ్వులు
మోములందున మొలక నవ్వులు
చెలగి చెలికత్తెల్
వెంటనడిచిరి.

అంత పట్టపు రాజు యెదురై
కన్నె సొగసుకు కన్ను చెదురై
మరుని వాడికి గుండె బెదురై
యిట్లు తలపోసెన్ :

"ఔర ! చుక్కల నడుమ చందురు
నట్లు వెలిగెడు కన్నె ముందర,

వన్నె కాంచిన నగరి సుందరు
లంద రొక. లెక్కా ?"

"పట్టవలెరా దీని బలిమిని
కొట్టవలెరా మరుసిరాజ్యం
కట్టవలెరా గండపెండెం
రసికమండలిలో."

నాల నడుమను నట్టివీధిని
దుష్ట మంత్రులు తాను పెండెం
గట్టి కన్నెను చుట్టి నరపతి
పట్ట నుంకించెన్.

మట్టి వచ్చిన దైవగతి కిక
దైవమే గతి యని తలంచుక
దిట్టతనమును బూని కన్నియ
నెట్ట నిటు పలికెన్.

"ముట్టబోకుము దేవకార్యం
తీర్చవచ్చెద, నీవు పట్నం
యేలురాజువు, సెట్టికూతుర,
నెటకు పోనేర్తున్."

చుట్టములు తన చుట్టు నిలవగ
భృత్యవర్గం కాచి కొలవగ
సెట్టి కరములు మోడ్చి రాజుకు
ఇట్లు వినిపించెన్ :

"పట్టమేలేరాజ ! బలిమిని
పట్టవలెనా ? నీదు సొమ్మొ
కాద కన్నియ ? నీవుకోరుట
కన్న మరి కలదా
వైశ్యజాతికి వన్నె ?

గాని మన్నన జేసి మమ్ముల
బంధువర్గం, కులం పెద్దల,
ధర్మ మన్నది అరసి కొంచం
దారి కనపడితే,

అగ్నిసాక్షిగ కన్నె గైకొని
ఆదరించుము మమ్ము, కానుక
లందుకొమ్మెం తెంత వలసిన,
మనుచు మాజాతిన్."

నవ్వి హేళన నవ్వు, నరపతి
పల్కె "నోహో ! ధర్మ మార్గం
పట్టమేలే రాచబిడ్డకు
సెట్టి కరపడమా !

రాజు తలచిందేను ధర్మం,
రాజు చెప్పిం దెల్ల శాస్త్రం,
రాజులకు పేరైన పద్ధతి
కాద, గాంధర్వం !

తడవు చెయ్యక తల్లడిల్లక
నేడు రేపని గడువు పెట్టక,
నెమ్మిగోరితి వేని, కన్నియ
నిమ్ము!
లేకుంటే, పొమ్ము!

దేగ, పిట్టను పట్టి విడుచున!
కన్నె, యింటికి మరలినడుచున,
తెమ్ముకానుక లిమ్ము, నీవిటు
వచ్చి నందాకన్,

కదల"నంతట సెట్టి పలికెను,-
"దేవకార్యం ముందు, ఆవల
రాచకార్యం కాద రాజా!
శలవు నీవిస్తే-

యింటి దైవం వీరభద్రుడి.
దేవళానికి పోయి యిప్పుడె
పళ్ళెరం సాగించి వత్తును
పైని తమచిత్తం!"

"మంచిదే, మరి నడువు, మేమును
తోడవత్తుము, దేవళంలో
అగ్నిసాక్షిగ కన్యకను మే
మందుకొనగలము."

ii

నాడు గుడిలో మండె గుండం
మంట మింటిని ముట్టియాడగ
కన్న నరపతి గుండె దిగులై
పట్టు విడజొచ్చెన్.

భక్తిపరవశమైన మనసున
దుర్గ నప్పుడు కొలిచి. కన్యక.
ముక్తి వేడుచు వూడ్చి నగలను
శక్తి కర్పించెన్.

దుర్గ కొలనున గ్రుంకి పిమ్మట
రక్తగంధం రక్తమాల్యా
దాల్చి గుండం చుట్టు నిలిచిన
జనుల కిట్లనియెన్ !

"అన్నలారా తండ్రులారా
ఆలకించం డొక్క విన్నప
మాలుబిడ్డల కాసుకొనుటకు
ఆశలే దొక్కొ
కులము లోపల !

పట్నమేలే రాజు అయితే
రాజునేలే దైవముండడొ !
పరువు నిలుపను పౌరుషము మీ
కేల కలుగదొకో !

విద్య నేర్చినవాడు విప్రుడు
వీర్య ముండినవాడు క్షత్రియు
డన్న పెద్దల ధర్మపద్ధతి
మరచి, పదవులకై

ఆశచేయక, కాసువీశం
కలిగివుంటే చాలు ననుకొని,
వీర్య మెరగక, విద్యనేర్చక,
బుద్ధమాలినచో

కలగవా యిక్కట్లు! మేల్కొని,
బుద్ధిబలమును బాహుబలమును
పెంచి దైవమునందు భారం
వుంచి, రాజులలో

రాజులై మనుడయ్యా!" ఇట్లని
కన్య నరపతి కప్పు డెదురై
నాలు గడుగులు నడచి ముందుకు
పలికె నీకేకన్;

"పట్టపగలే, నట్టి వీధిని
పట్టబోరే జారచోరులు
పట్టదలచితి పింక నీవాక
పట్నమేలే రాజు వట!

కండకావర మెక్కి నీ వీ
దుండగము తలపెట్టినందుకు

వుండడా వొక దైవమంటూ,
వుండి వూరొకనునా?

కులంపెద్దలు కూడి రదుగో!
అగ్నిసాక్షికి అగ్ని అదుగో!
కన్నుకోరిన కన్నె యిదుగో!
జాల మే లొక్కో?

పట్నమేలే రాజునైతే
పట్టు నన్నివు డనుచు కన్యక
చుట్టిముట్టిన మంటలోనికి
మట్టి తా జనియెన్.

పట్నమేలేరాజు గర్వం
మట్టిగలిసెను, కోటపేటలు
కూలి, నక్కల కాటపల్లై
అమరె.

యెక్కడైతే కన్య, మానం
కాచుకొనుటకు మంటగలిసెనొ,
అక్కడొక్కటి లేచె సౌధము
ఆకసము పొడుగై.

పట్నమేలే రాజుపోయెను,
మట్టికలిసెను కోటపేటలు,
పదం పద్యం పట్టి నిలిచెను
కీర్తు లపకీర్తుల్.

# డామన్ పితియాస్

వన్నెకెక్కిరి డమను పితియసు
లన్న యవనులు ముజ్జగంబుల
మున్ను; వారల స్నేహసంపద
నెన్న సుకృతంబా.

ఒక్కనా డాసీమ జనపతి
యక్కజంబగు కోపభరమున
"ప్రక్కలింపుము డమనుశిరమ"ని
పలికె తలవరితోన్.

చెక్కుచెదరక నిలిచె డమనుడు
"నిక్కమే కద చావు నరునకు
యెక్కు డెప్పుడు, యెట్టుల గూడిన
నొక్కటే కాదా !

క్రుందు టన్నది బొంది మార్చుట
ముందు భవమున కలుగు విభవము
నందజేయుట కాదె, యేలిక,
డెందమును విడను !

కాని యింటికిపోయి యొకతరి
కనులజూచెద నాలుబిడ్డల;
పనులు తీర్చుకు మరలివత్తును
యానతీయం డనియెన్."

వింతపలుకుకు విస్మితుండై
కొంత కరకరి తీరి నరపతి,
"యింతయిట్టుల మిడుసెవిద్య"ను
చింతచిగురె త్తన్.

అనియె నరపతి "యటుల కాని మ్మ
వని కొంచెము విప్రుల మందుకు;
తనువు దాచను తగిన చోటులు
కలవు యెటు. జనినన్.

మించు చతురత మాట విరుపున
యెంచినాడవు చెడ్డమంచని;
పంచప్రాణము లందు ప్రేముడి
పరచునే? చెప్పుమా?

ఆలుబిడ్డల చూతు నంటివి;
ఆలకించిన వారి శోకము
తొలగు విద్యలు తొలగు ధైర్యము,
తొలగు నీ తైనన్.

కాన నీకై తనువు నొడ్డెడి
వాని నొక్కని జూపి చననగు;
మానవేశుని యాన తప్పిన
మాయదే జగము?"

లేచి పలికెను పితియసప్పుడు;
"రాచసింగమ! ఒడలి కొడలిదె:

వేచి యుంటిని బ్రతుకు ఫలముకు,
దొరికె నీ నాటన్."

"ఐన, చనుమ" ని నవనిపతి, డా
మనుడు కొంచెము తలచి, యిట్లను
"పనుపు, భటులను పనికి నిప్పుడె
పోవ నే నొల్లన్.

వొకటి తలచును నరుడు మది; వే
రొకటి తలచును బ్రహ్మ వినమే ?
పోక రాకల నడుమ నడ్డము
నెన్ని తలపడునో ?"

"పొమ్ము; పొమ్మ"ని రేడు, "పొమ్మిట;
రమ్ము, యీ నెల నిండు నంతకు;
లెమ్ము, చాలదె యదను పోరా,
నడ్డు గడ్డైనన్.

ii

కడలి నడుమను కలదు సేమా
సనెసి ద్వీపము కవుల పుట్టిలు;
వాడి లేదట యినుని వేడికి
సీతు వలికైనన్.

ఋతువు కొక్కొక వింత రూపం
బతెల శోభా భాజనంబై

మతుల కొల్లలనాడు స్వర్గం
బేమొ యాసీమ !

అందు నుండొక కొండ కోనను
సుందరంబగు భవనరాజము;
విందు కనులకు కడలి యెదురై
లీల లోలాడన్.

పక్షముల నారింజ, ఆలివు
వృక్షషండము లుప్పతిల్లును;
ద్రాక్ష పందిరు లింటిపంటలు
సొంపు పచరింపన్.

నవ్వులకు నెనరులకు నిల్లై
నివ్వటిల్లెను భవన రాజము;
పువ్వులెత్తును దాన నిలచిన
మెండు మనసైనన్.

తదియ చందురు డబ్ధి పోకెను;
చదల విడబడి, యురులు ప్రాకెను;
అదును కాంచిన రిక్క-మూకలు
అంతటను ప్రబలెన్.

చారుతరముగ పసిడిపమిదల
బారుతీరి వెలింగె జోతులు;
వారియంత్రము తళుకు ముత్తెపు
సరులు విరజిమ్మెన్.

అలతు జిగురుల తోరణావళి
యలమి చుట్టెను జిలుగు కంబము
లుల్ల మలరగ నాటపాటలు
వుమ్మిరయి సెలగన్.

ఘుమ్ము, ఘుమ్మని కమ్మతావులు
గ్రమ్మె ధూపము లాసవమ్ముల
దుమ్ము రేగెను నాటి పండువ
నిండు వేడుకతోన్.

చుట్టలును మిత్రులును, భ్రాతలు
చుట్టు మూగుచు డమను నడిగిరి
"యెట్టివింతలు తెచ్చినాడవు ?
కలదు వేడ్క, గనన్ ?"

పలికె డామను "యిలను ద్రిమ్మరి
పలు తెరంగుల జనుల గాంచితి;
తెలియనేర్చితి మర్మ మెల్లను
వారి విద్యలలో.

మెసుగరాదని తొల్లి విబుధులు
మరుగు పరచిన మంతనంబుల
నిరుగుడులు మరలించి, తీసితి
రాల రప్పలలోన్.

వింత నొక్కొక దాని కని, మును
యింత కెక్కడు లేదనుంటిని

వింత లన్నిటి వమ్ముగ జేసెడి
వింత విను డింకన్.

'ఒకటె' ఆయెను రెండు మూడులు
'ఒకటె' ఆయెను కోటిసంఖ్యలు
పెక్కు లొకక్కటిగ జూచు వాడే
ప్రాజ్ఞు డన వినవే?

నేను తానను భేద బుద్ధిని
లేని కాగ్రహ మొదవి డామను
కానివాడ ని తలచి ప్రాణము
గోలుపో మ్మనియెన్.

ఒక్క వింతిది — పిరికి డామను
వొకటి వొకటికి సమముకద? వే
రొకడు నాకయి ప్రాణమిచ్చిన
చాలదా యనియెన్?

వింత రెండవ దిద్ది — నృపుడును
చింత వాపుచు వల్లె యనియె, న
నంతరము నే నిటకు వచ్చితి
వింత కన గోరి,

కాన, మీరల నెవ్వ డిప్పుడు
తాను, నేనను బుద్ధితలపక
తనువు నాకై విడుచువాడ" న
పలుక డొకడైనన్.

చింత వంతలు చిత్రితములై
అంత కానగ నయ్యె మోములు
"వింత యిదే" యని పలికి డామను
వికసి తాననుడై

ఆట పాటలు అణగె నంతట
మాటు మణగెను భవన రాజము;
చాటు మాటున బారజొచ్చిరి
సఖులు చుట్టములున్.

"కల్ల జెప్పితి !" ననియె డామను
"యెల్ల రెప్పటి యట్ల నలరుం
డుల్లముల !" వా రపుడు "కాను మీవె
ప్రాణములు" నన్నన్.

పంజరమ్ముల నున్న పిట్టలు
మంజు లారణ్యములు మరచెను
శింజితములౌ కాలి గొలుసులు
శిక్ష యని మరచెన్.

"దారిపోయే వారి కొక్కటి
* కారవాసర కల్పదాయెను
దారి కా దది దరి యటంచును
తలచు టొక వింత !"

అనుచు, డామను డాసవమ్ముల
నాని పాడ దొడంగి మించెను

* కారవాసర = Caravansary = చనుప

కాని పండువునందు కొండొక
కలక కననయ్యెన్.

iii

ఎల్లి పున్న మనంగ పితియను
యిల్లునం దొక విందు మిత్రుల
కెల్ల నాయెను, పితియ సప్పుడు
పల్కె నీ పగిదిన్.

"తెలియు వాడన, నొక్కడే భువి;
తెలుపు వాడన నొక్కడే భువి;
పలు తెరంగుల సద్గుణాళికి
పట్టు వక్కండే!

కనియు, నేర్చుట వానికడనే;
వినియు, నేర్చుట వానివలనే;
అగగవలెనా, అతడు డామను
డన్న మా టొకటి?

లోకమం దభిమాన ముంచిరొ
నాకు యశమొనగూర్చ నెంచిరొ,
నాక పతి, నామిత్రుడామను
రాక నడ్డ డొకొ!

బ్రతికి, చచ్చియు, ప్రజల కెవ్వడు
బ్రీతిగూర్చునొ, వాడె ధన్యుడు;

బ్రతికి, డామను ప్రజల నేదును
చచ్చి నే నొకడన్.

క్రిందు టన్నది బొంది మార్చుట;
ముందు భవమున కల్గు విభవము
నంద, ప్రాజ్ఞుడు వగవ జెల్లునె
చెప్పుడీ" యనియెన్.

"చదివి చెడితివి చాలున"నె నొక
"డొదవె యశము"ని బలికె నొక్కం
"డదచునను డామనుడు రాడా?"
యనియె నొక్కరుడున్.

అంత పితియను కాంత పలికెను
కొంత గద్గదికంబు తోపగ,
"ఇంత వరకును ధైర్య మూనితి
మాట నమ్మికచే.

వచ్చువా డయితేను డమనుడు
వచ్చు నింతకె; చావు కోసము
నుచ్చగించుచు తానె వచ్చునె
పిచ్చివా డైనన్,

వత్తు నన్నను, వారివారలు
మొత్తమై తామడ్డు పడరే!
పొత్తు లన్నవి సంపదలకే
ఆపదల కగునే?

వాని ననుచే లింత ? పతి తన
చాన నెంచక, బలగ మెంచక
తనువు మిత్రుని కోడు టన్నది
తగవ ? ఇది చెప్పుడా !

కష్టసుఖముల కలసి కుడుచుచు,
గోష్ఠిప్రాణం బంచు నెంచుచు,
ఇష్ట వర్తన నున్న చానను;
భాయు లోకే మహిమా !

విందు, నీల్లుట నిక్క మాటను
యెందు, యెప్పుడైన నొకటని;
యొదరో కల రనెడు వారలు
లేరు చనువారల్.

చదువువారికి వెఱ్ఱి భ్రాంతులు
మొదడు కెక్కిన పాయ వందుగు;
అదును లేదే దేనికైనను
అంద రెరుగనిదే !

పండ గలదని కాయ కుడుతురె ?
తిండి యెల్లిది నేడు తిందురె
అండ మందున చిలుక కలదని
అరచి జీరెదరే !

బతక వలసిన కాలా ముండగ
బతుక నొల్లమి కంటె పుట్టునె

బతుకు దునిమిన బతుకు భారము
పాయదే చెపుడా !

అది యటుండగ దమనుపై పగ
మది దలంచిన మానవేశుడు
బదులుగా గొని పాప మెరుగని
ప్రాణినేల నొకో ?

నరుని చావే కాంక్ష్య మేనియు
నరపతికి, నరు లెంద రనుదిన
మరుగు వారలు యముని పురమున
కంత తనియ డొకో ?

తప్పు వొక యెడ దండ మొక యెడ
వొప్పె యని, నరపతికి దోచిన
వప్పగించెద నాదు ప్రాణము
దమను క” న్నంతన్.

నీడ వెలువడి నిలిచె ముందట
వేడ్క మోమున వెల్లి విరియగ
“వీడె దమనుం” డంచు నందరు
విస్మయము చెందన్.

ఆ మహామతి; అంత వేరొక
యమిత విక్రము డతని క్కైదుగ్గై,
“దమన ! బతుకుము బతుకు” మనె;
“రేడ” నిరి పలువు రటన్.

పలికె నరపతి " మిత్రభావము
సలుపు డిక నీ సఖుఁడు నీపును;
అలఘురాజ్యము ప్రేమసంపద
కలిగెయని దలఁతున్.

విద్య యందలి మాయ మర్మము
దిద్ది చెప్పెం దబల యొక్కతె
విద్య లెరుగని ప్రేమ భరమును
వింతగా చూపెన్.

వినగ తగినది వింటి నిచ్చట;
కనగ తగినది కాంచినాడను;
మనుజు లిద్దరు మగువ యొక్కతె
మాన్యు లీ జగతిన్."



# పూర్ణమ్మ

మేలిమి బంగరు మెలతల్లారా!
కలువల కన్నుల కన్నెల్లారా!
తల్లులగన్నా పిల్లల్లారా!
విన్నా రమ్మా యీ కథను.

ఆటల పాటల పేటికలారా!
కమ్మని మాటల కొమ్మల్లారా!
అమ్మల గన్నా అమ్మల్లారా!
వినరమ్మా మీ రీ కథను.

కొండల నడుమను కో నొక టున్నది;
కోనకి నడుమా కొల నొక టుంది;
కొలని గట్టునా కోవెల లోపల;
వెలసెను బంగరు దుర్గమ్మ.

పూజా రింటను పుట్టెను చిన్నది
పుత్తడి బొమ్మా పూర్ణమ్మా;
అన్నల తమ్ముల కనుగై ముగ్గకు
పూజకు పువ్వులు కోసేది.

ఏ యే వేళల పూసే పువ్వుల
ఆ యా వేళల అందించి
బంగరు దుర్గను భక్తితొ కొలిచెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మ.

ఏ యే ఋతువుల పండే పళ్ళను
ఆ యా ఋతువుల అందించి
బంగరు దుర్గను భక్తితో కొలిచెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మ.

పళ్ళను మీరిన తీపుల నడలును
పువ్వుల మీరిన పోడుములున్
అంగము లందున అమరెను పూర్ణకు
సౌరులు మించెను నానాటన్.

కాసుకు లోనై తల్లీ తండ్రీ
నెనరూ న్యాయం విడనాడి
పుత్తడి బొమ్మను పూర్ణమ్మను వొక
ముదుసలి మొగడుకు ముడి వేసిరి.

ఆమని రాగా దుర్గ కొలనులో
కలకల నవ్వెను తామరలు
ఆమని రాగా దుర్గవనములో
కిలకిల పలికెను కీరములు.

ముద్దు నగవులూ మురిపెంబులు మరి
పెనిమిటి గాంచిన నిమిషమున
బాసెను కన్నియ ముఖ కమలమ్మును
కన్నుల గ్రమ్మెను కన్నీరు.

ఆటలపాటల తోటి కన్నియలు
మొగుడు తాత యని కేలించ,

ఆటల పాటల కలియుక పూర్ణమ
దుర్గను చేరీ దుఃఖించే.

కొన్నాళ్ళకు పతి కొని పోవచ్చెను
పుత్తడి బొమ్మను పూర్ణమను;
చీరెలు సొమ్ములు చాలగ దెచ్చెను
పుత్తడి బొమ్మకు పూర్ణమకు.

పసుపు రాసిరి బంగరు మేనికి
జలకము లాడెను పూర్ణమ్మ;
పదినెలు పూర్ణకు పరి పరి విధముల
నేప్పులు మెరసీ కై చేస్రీ.

పెద్దల కప్పుడు మొుక్కెను పూర్ణమ
తల్లీ తండ్రీ దీవించి;
దీవన వింటూ పక్కన నవ్వెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మ!

చిన్నల నందర కౌగిట చేర్చుకు
కంటను బెట్టెను కన్నీరూ;
అన్నల తమ్ముల కప్పుడు పలికెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మ.

"అన్నల్లారా తమ్ముల్లారా!
అమ్మను అయ్యను కానండీ!
బంగరు దుర్గను భక్తితో కొలవం
డమ్మల కమ్మా దుర్గమ్మ.

ఆ యా వేళల పూసే పువ్వులు
ఆ యా ఋతువుల పళ్ళన్నీ,
భక్తిని గోసి శక్తికి యివ్వం
డమ్మల కమ్మా దుర్గమ్మ.
నలుగురు కూచుని నవ్వే వేళల
నాపే రొకతరి తలవండి;
మీా మీా కన్నబిడ్డల నొక తెకు
ప్రేమను నాపే రివ్వండి".
బల బల కన్నుల కన్నీ రొలికెను
పుత్తడి బొమ్మకు పూర్ణమ్మకు
కన్నులు తుడుచుకు కలకల నవ్వెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మ.
వగచిరి వదినెలు, వగచిరి తమ్ములు
తల్లియు కంటను తడిబెట్టెన్.
కాసుకు లోనై అల్లుని తలుచుకు
ఆనందించెను అయ్యొకడే.
యెప్పటి యట్టుల సాయంత్రమ్మున
యేరిన పువ్వులు సరిగూర్చి
సంతోషమ్మున దుర్గను కొలవను
వొంటిగ బోయెను పూర్ణమ్మ.
ఆవులు పెయ్యలు మందల జేరెను
పిట్టలు చెట్లను గుమిగూడెన్
మింటను చుక్కలు మొరయుచు పొడమెను
పూర్ణమ్మ యింటికి రా దాయె.

చీకటి నిండెను కొండల కోనల
మేతకు మెకములు మెసలజనేన్
దుర్గకు మెడలో హారము లమరెను
పూర్ణమ యింటికి రా దాయె.

కన్నుల కాంతులు కలవల చేరెను
మేలిమి జేరెను మేని పసల్ !
హంసల జేరెను నడకల బెడగులు
స్వర్గను జేరెను పూర్ణమ్మ.



# మనిషి

మనిషి చేసిన రాయి రప్పకి
మహిమ కలదని సాగి మొక్కుతు
మనుషులంటే రాయిరప్పల
కన్న కనిష్టం

గాను చూస్తా వేల, బేలా ?
దేవు డెకడో దాగె నంటూ
కొండ కోనల వెతుకు లాడే
వేలా ?

కన్ను తెరచిన కానబడడో ?
మనిషి మాత్రుడి యందు లేడో ?
మొరిగి, కోరిన కరిగి యీడో ?
ముక్తి.

# దేశభక్తి

దేశమును ప్రేమించు మన్నా,
మంచి అన్నది పెంచుమన్నా
వొట్టి మాటలు కట్టి పెట్టోయ్,
గట్టిమేల్ తలపెట్ట వోయ్.
పాడి పంటలు పొంగి పొర్లే
దారిలో నువు పాటు పడవోయ్;
తిండి కలిగితె కండకలదోయ్ !
కండ కలవాడేను మనిషోయ్ !
యీసురో మని మనుష్యు లుంటే
దేశ మేగతి బాగుపడు నోయ్ ?
జల్దుకొని కళ లెల్ల నేర్చుకు
దేశి సరుకులు నించవోయ్.
అన్ని దేశాల్ క్రమ్మవలె నోయ్,
దేశి సరకుల నమ్మవలె నోయ్ !
డబ్బు తేలే నట్టి నరులకు
కీర్తి సంపద లబ్బవోయ్.
వెనక చూసిన కార్య మే మోయ్ ?
మంచి గతమున కొంచె మే నోయ్
మందగించక ముందు అడుగేయ్
వెనుక పడితే వెనకె నోయ్ !
పూను స్పర్ధను విద్య లందే
వైరములు వాణిజ్య మందే,

వ్యర్థ కలహం పెంచ బోకోయ్ !
కక్షి వైరం కాల్చ వోయ్ !

దేశాభిమానం నాకు కద్దని
వొట్టి గొప్పలు చెప్పుకోకోయ్;
పూనియేదైనాను వొక మేల్
కూర్చి జనులకు చూపవోయ్ !

ఓర్వలేమి పిశాచి దేశం
మూలుగులు పీల్చేసె నోయ్,
ఒరుల మేలుకు సంతసిస్తూ
ఐకమత్యం నేర్చవోయ్ !
పరుల కలిమికి పొర్లి యేడ్చే
పాపి కెక్కడ సుఖం కద్దోయ్ ?
ఒకరి మేల్ తన మేల నెంచే
నేర్పరికి మేల్ కొల్ల లోయ్ !
స్వంత లాభం కొంత మానుకు
పొరుగు వాడికి తోడు పడవోయ్
దేశ మంటే మట్టి కాదోయ్,
దేశ మంటే మనుషు లోయ్ !

చెట్ట పట్టాల్ పట్టుకుని
దేశస్థు లంతా నడవ వలె నోయ్ !
అన్న దమ్ముల వలెను జాతులు
మతము లన్నీ మెలగ వలె నోయ్.

మతం వేరై తేను యేమోయ్ ?
మనసు లొకటై మనుషు లుంటే
జాత మన్నది లేచి పెరిగి
లోకమున రాణించు నోయ్ !
దేశ మనియెడి దొడ్డవృక్షం
ప్రేమలను పూ లెత్తవలెనోయ్,
నరుల చమటను తడిసి మూలం,
ధనం పంటలు పండవలెనోయ్ !
ఆకులందున అణగిమణగీ
కవిత కోయిల పలుక వలెనోయ్
పలుకులను విని దేశ మం దభి
మానములు మొలకెత్త వలెనోయ్ !



## దించు లంగరు

దించు లంగరు దీర్ఘ యుద్ధం
ధర్మ పక్షము ముల్లు చూపెను
నరుల పీనుగ పెంట పోకల
నాటి వెలయును శాంతి వృక్షము.

పాత సంధులు పాతి పెట్టుము
యుద్ధముల కవి ఊనికిపట్టులు
లోక మంతయు ఏకమై
యుద్ధమునె మారణము చేయును.

వచ్చె నిది బంగారు కాలము
వాంఛ లెల్లను తీరు సుజనుల
కాంగిరేయుల ధర్మ రాజ్యము
జ్ఞానమును స్వాతంత్ర్య మిచ్చుచు
సంతతము వర్ధిల్లు గావుత !



# లంగరెత్తుము

విరిగి పెరిగితి; పెరిగి విరిగితి;
కష్ట సుఖముల పార మెరిగితి;
పండు నన్నవి ఆ శలెన్నో
ఎండి రాలగ చూగిలితిన్.

అంద జాలని పళ్ళ కోసము
అఱ్ఱు జాపితి; నేల ప్రాకిన
చెట్ల పళ్ళను విలువ తెరుగక
పాద రక్షల మట్టితిన్.

తీపి విరిగిన చెఱకు వలె ఆ
నాటి కోర్కెలు నేడు బెండో
టుంచి నవ్వితి; బుద్ధి చపలత
కొత్త కోర్కెల తగిలితిన్.

దేవతలతో జోడు కూడితి,
రక్కసులతో కూడి ఆడితి;
క్రొత్త మిన్కుల తెలివి పటమును
మంచి చేష్టల మార్చితిన్.

చూతునా! అని చూసితిని; మఱి
చేతునా! అని చేసితిని; ఇక
చూడ చేయగ రాని వింతలు
చూపి కన్నులు కట్టితిన్.

శత్రు మిత్రుల కిచ్చి నెనరులు
స్నేహ వార్ధిని కొల్ల గొంటిని;
నాటి మిత్రులు తరల శూన్యం
బైన పుడమిని నిలిచితిన్.

పంజరంబున నున్న కట్లను
పగల దన్నగ లేక స్రుక్కితి;
నింగి పర్వగ లేని జన్మము
నీరసం బని గోసితిన్.

“[illegible]సుములకు విసికితివా? యుద్ధము
[illegible]దు; దేశము కొఱకు పోరుము”
యుద్ధమా? ఇక నేమి లోకము!
చాలు! చాలును! లంగ రెత్తుము!

